అన్నిహక్కులు రచయితవి

వెల 0-8-0

లక్ష్మీ పవర్ ప్రెస్,
— తెనాలి. —

ఇతరరచనలు :—

1. గాంధీజం, ఫాసిజం, సోషలిజం
2. మధ్యతరగతి
3. రాడికల్ నాయకులు
4. రాడికల్ సూత్రాలు
5. బాంభేప్లాను
6. పెండ్లిపద్ధతి
7. కలకత్తా మహాసభ

# వుపోద్ఘాతం

చిన్న చిన్న విషయాలు దరిమిలా చూచుకోవచ్చుని, యీచిత్తు రాజ్యాంగం ముఖ్యమైన, వివాదకారణాలైనవాటిని గురించి మాత్రమే చెబుతుంది. స్థూలంగా చూస్తే, యీ రాజ్యాంగవిధానం సమగ్రంగానే వుంది. యీ విషయాన్ని అంగీకరిస్తే, వివరాలు తర్వాత భర్తీచేసుకోవొచ్చు, చిల్లర ప్రకరణాల్నిగూడా కొన్నింటిని చేర్చవలసివుంటుంది.

యీ రాజ్యాంగాన్ని మార్చాలన్నా, సవరణ చెయ్యాలన్నా యేవిధంగా చెయ్యాలో చెప్పలేదు. ఆ విషయం యీచిత్తు రాజ్యాంగంలోనే యిమిడివుండనేవుంది. అయినా, దీన్నిగురించి ఒకప్రకరణం చేర్చవలసివుంటుంది.

ఆయుధాలు, జాతీయపతాకం, ప్రభుత్వకేంద్రం మొదలైనవన్నీ కేవలం లాంఛనవిషయాలు. వాటినిగురించి యేమీ తగాదావుండదు.

సైన్యాలకు, సివిల్ అధికారులకు వున్న సంబంధాన్ని గురించి ఒకప్రకరణం చేర్చాలి. కాని, యీ సంబంధం ప్రజాస్వామ్య రాజ్యాంగానికి సంబంధించినది గనుక, దాన్నిగురించి యేమీ సందిగ్ధత వుండదు. ప్రజాస్వామ్య రాజ్యాంగంలో, ప్రజాసైన్యం వుంటుంది. నిర్మాణవిషయాల్లో రాష్ట్రీయంగా వున్నా, కేంద్ర రాజ్యాంగాధికారంకిందనే వుంటుంది. యీ రాజ్యాంగంలో ప్రతిపాదింపబడ్డ ప్రదుక్పథం, మిలిటరీకీ, సివిల్ అధికారులకు యెన్నడూ తగాదాలకు కారణంకాదు. ప్రజాస్వామ్య దేశాల్లో, దేశరక్షణకు ఆయుధాల్ని ధరించటం ప్రతిపౌరుడికీ హక్కేగాక, బాధ్యతగూడాను. యీ ప్రజా

స్వామ్య సూత్రాన్ని ఆధారంచేసుకునే, సైన్యం నిర్మాణం చెయ్యబడుతుంది.

(1) అధికారాన్ని యేవిధంగా సంక్రమణ చెయ్యాలి (2) రాజ్యాంగనిర్మాణ మెట్లావుండాలి, (3) అధికారం యెక్కడనుంచి వస్తుంది — అనేవిముఖ్యమైన ప్రశ్నలు. అసలు తగాదావిషయం, ముస్లింలీగుయొక్క కార్యక్రమం. యింకా, నిమ్నజాతులవంటి యితర సంఘాలనుగూర్చిగూడా వాదోపవాదాలున్నై. యీ వివాదాంశాలన్నింటికీ తగిన సమాధానాన్ని మన చిత్తురాజ్యాంగం యిస్తుంది.

భావిభారత రాజ్యాంగవిధానం, అధికార సంక్రమణాన్ని పునాదిగా తీసుకునే తయారుచెయ్యాలని ఒకపక్షంవారంటం, యింకోపక్షంవారు సరేనంటం జరుగుతుంది. అధికారాన్ని మార్చటం అనగానే రెండు ముఖ్యవిషయాలువస్తై: (1) అధికారాన్ని యెవరికిమార్చాలి, (2) యేవిధంగా మార్చాలి అనేవి. రెండోప్రశ్నకు సమాధానం మొదటిప్రశ్నకు యిచ్చే సమాధానంమీద ఆధారపడివుంటుంది.

ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని గురించి మాట్లాడేటప్పుడు, సాధారణంగా అధికారం ప్రజలకే మార్చాలిఅనే ఉద్దేశ్యంతో చెబుతున్నామ్. యీ సూత్రాన్ని అంగీకరిస్తే, వారూ వీరూ చెప్పేదికాక, అసలు అధికారసంక్రమణ విషయం తేలిగ్గా బోధపడుతుంది.

ప్రజలయొక్క సర్వతంత్రఅధికారాల్ని సూచిస్తూ, 'ప్రజా ప్రతినిధిపరిషత్తు'ను సమావేశపరచి, రాజ్యాంగాన్ని తయారు చేస్తే బాగుంటుందని నాలుగుమూలలనుంచీ అంటున్నారు. అక్కడగూడా, యేవిధానాన్ని అవలంబించాలి అనే ప్రశ్న

వుండనేవుంది. ప్రజాప్రతినిధి పరిషత్తును యెవరు సమావేశ పరుస్తారు? ప్రజల సర్వతంత్రఆధికారాన్ని దానికెట్లా అప్ప యిస్తారు? తిరుగుబాటు సమయంలో ప్రజలు ప్రజాప్రతినిధి పరిషత్తును నిర్మించుకుంటారు. కనక, యీ పరిషత్తుల తత్వాన్ని యెరిగి, వూహిస్తే యీచిక్కుప్రశ్నలన్నీ రానే రావు. యిండియాలోని రాజకీయపార్టీలేవీ యీ పరిషత్తుని యీ దృష్టిలో అర్థంచేసుకోటంలేదు. అందుకని, ఆ ప్రజా ప్రతినిధి పరిషత్తును సమావేశపరిచేముందు, దేశంలో ఆపని చేయగల అధికారవర్గం ఒకటి కావాల్సివొస్తుంది. ప్రజలు తిరుగుబాటుచేసి అధికారాన్ని కైవసం చేసుకోవాలన్న దృష్టి లేకపోతే, బ్రిటిష్ పార్లమెంటుద్వారా అధికారంమార్చబడాలి.

దీంతో, రెండురకాలైన నిర్ణయాలు తేలతై. (2) అధి కారాన్ని యిండియాప్రజలకు మార్చాలంటే, బ్రిటిష్‌పార్ల మెంటు ఒకచట్టాన్ని ప్యాసుచెయ్యాలి; (2) సంధికాలంలో, తాత్కాలిక ప్రభుత్వాన్నొకదాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నియా మకం చెయ్యాలి.

తర్వాత, కార్యక్రమవిధానం తేలికే! అధికారాన్ని శాస్త్ర సమ్మతంగాను, లాంఛనంగానూ యిండియాప్రజలకు మార్చటం; తర్వాత, యిండియాప్రజలు తమ సర్వతంత్రతమాన్యాన్ని సావ కాశంగా ఆచరణపర్చుకోటానికి తగిన, చట్టబద్ధమైన అధికా రాన్ని యేర్పాటుచేయటం. అధికారాన్ని మార్చటం అనే పద్ధతుల్లో, రాజ్యాంగాలు మారేటప్పుడు తాత్కాలిక ప్రభు త్వం తప్పనిసరిగా వుండితీరాలి.

తాత్కాలిక ప్రభుత్వనిర్మాణాన్ని గురించి పెద్ద వివాదం యేమీ వుండదు; యీరాజ్యాంగాన్ని ప్రతిపాదించటానికి

పూనుకొన్న వారితో నిర్మాణం చెయ్యబడుతుంది. బ్రిటిష్ పార్లమెంటువారు చేసే చట్టం, వీలునామాలాంటిది; యీ వీలు నామా సంతకందారు, దాన్ని అమలుపరిచేందుకు తగిన వాళ్ళని శాస్త్రబద్ధంగా నియమించొచ్చు. తాత్కాలిక ప్రభుత్వాధికారాన్ని యీచట్టం నిర్ణయించి, నియమించొచ్చు, అధికారాన్ని మార్చేందుకు సావధానంగామాత్రం యీ తాత్కాలిక ప్రభుత్వం పనిచేస్తుంది.

యీనాడు యిండియాలో ప్రబలివున్న దుస్థితిపోవాలంటే, వివిధరాజకీయపార్టీలు భావిరాజ్యాంగాన్ని గురించి ఒక అంగీకారానికి రాలేకపోయినై గనక, బ్రిటిష్‌పార్లమెంటు ఆపనికి తాను పూనుకోవాలి. యీచిత్తు రాజ్యాంగంలో చూపబడిన మార్గం యేమిటంటే, యిండియాప్రజల భవిష్యత్తును, అంగీకారానికి రాలేని పార్టీలయొక్క, నాయకులయొక్క చేతుల్లో నుంచితీసి, ప్రజల చేతుల్లోనే వుంచటం. యీ ప్రణాళిక కొన్ని సాంఘిక, రాజకీయ మూల సూత్రాన్ని మీద ఆధారం చేసుకొని తయారుచేయబడింది; అభివృద్ధికోరే ప్రతి స్వాతంత్ర్యోపాసకునికి యీ సూత్రాలు ఆమోదకరమే! యీ సూత్రాలు నాలుగు సంవత్సరాలనుండి దేశంలో ప్రచారం చేయబడుతున్నై. జనామోదాన్ని పొందినై. సావకాశంగ కవుంటే, భారత ప్రజానీకంలో మెజారిటీ అభిమతాన్ని పొందగలుగుతై. కాబట్టి, యీ ప్రణాళికలో సూచింపబడ్డ మార్గంవల్ల, బ్రిటిష్ ప్రభుత్వం ఒకరాజ్యాంగాన్ని యిండియామీద రుద్దటంకాదు; బ్రిటిష్ ప్రజాస్వామ్యం యిండియా ప్రజలకు సహాయంచేయుట మవుతుంది.

అసలు విషయ మేమిటంటే. యీరాజ్యాంగాన్ని యిండి యాకి యేవిధంగా యిచ్చారా అనేదికాదు; యీ రాజ్యాంగంలోవున్న సూత్రాలు. యీ దృక్పథంతో గనక యీ రాజ్యాంగాన్ని చర్చిస్తే, జనాంగీకారాన్ని తప్పక పొంద గలుగుతుంది. దీన్ని అమలుపరిచే పద్ధతి, యేదో సమయాను కూలంగా యేర్పాటుచేయబడిందని భావించొచ్చు.

బ్రిటిష్ పార్లమెంటు చేయబోయే సంక్రమణచట్టంలో యీ రాజ్యాంగం ఒక భాగమైనప్పటికీ, దీన్ని అంగీకరించ టమా కాదా అనే అధికారం యిండియా ప్రజల్దే. కాబట్టి, దీన్ని యేవిధంగా అమలుపర్చాలా అనేది ప్రజలయొక్క స్వతంత్ర హక్కుల్ని యేమాత్రం కొంచపర్చలేదు. యీ రాజ్యాంగ విషయంలో, బ్రిటిష్ పార్లమెంటు చేసేపని, సిఫా ర్సుదారుడుగా వుంటం మాత్రమే. బ్రిటిష్ ప్రభుత్వాభి ప్రాయంలో యీ రాజ్యాంగం యిండియాలో సంపూర్ణ ప్రజాస్వామ్యాన్ని యేర్పాటు చేస్తుందని.

ఫెడరల్ విధానాన్నే యీ రాజ్యాంగం వూహిస్తుంది. కాని, 1935 యిండియాచట్టం భగ్నంకావటానికి వున్న కార ణాల్నిమాత్రం నిర్మూలిస్తుంది.

ముస్లింలీగువారి వాదానికి సమగ్రంగా సమాధానం యిచ్చాము. అధికారాన్ని మార్చకముందే, దేశంలో కొన్ని భాగాల్ని వేరుచెయ్యాలి అనేభావం, మన ఆచరణపద్ధతికి విరుద్ధంగావుంది. యీ రాజ్యాంగంలో ఆచిక్కును సరి దిద్దాము. యిండియా అంతా నైసర్గికంగాను, రాజ్యాంగ నిర్మాణవిషయంలో ఒకే యూనిట్ అనే భావంతో అధికార మారకం జరుగుతుంది. తర్వాత, తాత్కాలిక ప్రభుత్వం

చేత యేకభాష, యేకసంస్కారంగలిగి పాలనాసౌకర్యంగల రాష్ట్రాలుగా దేశం విభజింపబడుతుంది. యిట్లా విభజింపబడ్డ రాష్ట్రాలు యేయెన్నుకోబడ్డ సంస్థకూ బాధ్యులుగా వుండక, ఫెడరేషన్‌లో చేరటానికిగాని, చేరకపోవటానికిగాని స్వేచ్ఛగావుంటై.

ఫెడరేషన్‌లో చేరకుండా వుండదలచిన రాష్ట్రాలకు అధికారాన్ని యివ్వటమేగాక, విభేదాలకు తావులేకుండా వుంటానికి వీలైన ఫెడరేషన్‌కు యీ రాజ్యాంగం యేర్పాటు చేసింది. ఫెడరల్ విధానం, కేంద్రవిధానం సజావుగా సమన్వయింపబడినై.

1935 చట్టంలో ఫెడరల్ భాగాన్ని ఆచరణలో పెట్టటానికి స్వదేశసంస్థానాలు పెద్ద ఆటంకంగా తయారైనై. యే ఫెడరల్ రాజ్యాంగమైనా ఆ అడ్డంకు దాటవలసిందే. కాని, యీ స్వదేశసంస్థానాల సమస్యాపరిష్కారార్థం కేవలం ఒక కొత్త ద్రుక్పథంవుంది; సమస్యని సరిగా నిర్వచనం చెయ్యటంలోవుంది. కొన్ని భాగాలు నిరంకుశాధిపత్యంకింద వుండగా, ప్రజాస్వామ్య ఫెడరల్ యూనియన్ స్థాపించటానికి వీలుందా? వీలులేదనే సమాధానం తప్ప, వేరే యింకోసమాధానం లేనే లేదు. అధికారం యిండియాప్రజలకు మారకంచేస్తూ, యిండియాలో స్వదేశసంస్థానాలన్నింటిని వేరుగ వదిలి పెడతాననటం న్యాయంగా గాని, ధర్మంగాగాని వుండదు. కాక, యీ సంస్థాన ప్రజలకు కూడా న్యాయం జరగాలంటే, స్వదేశ సంస్థానాధీశ్వరులస్థితిఅగమ్యగోచరమౌతుంది. అందుకని, యీ సంస్థానాలు, యింగ్లీషుప్రభుత్వం చేసుకొన్న సంధిపత్రాల్ని చూపటం, ఒకపెద్ద ఆర్గ్యుమెంటుగావుంది. యీసంధి పత్రాల

ప్రకారం నడిస్తే, యివే పరమప్రమాణంగా అంగీకరిస్తే, బ్రిటిష్ ప్రజాస్వామ్యం యిండియాలో నియంతృత్వాన్ని అంగీకరించినట్లే. అందుకని, [illegible] విప్లవవ్యతిరేక సంధిపత్రాల్ని బ్రిటిష్ ప్రజాస్వామ్యం నిరాకరించటం న్యాయమేగాక, నైతికంగాకూడా విధ్యుక్తధర్మం. యీసంధి పత్రాలు యిప్పటికి యెంతోభిన్నమైన పరిస్థితుల్లో చేసుకోబడ్డై. కాలం మారింది. పరిస్థితులుమారినై. యీ సంధి పత్రాల్ని కాలగర్భంలో చేర్చాలి. బ్రిటిష్‌వారికి యేమైన బాధ్యత గనకవుంటే, అది సంస్థాన ప్రజల్ని రక్షించటమే! కోట్లకొలది ప్రజలకన్నా, పదిమంది సంస్థానాధీశ్వరులపట్ల బాధ్యత విలువకలదికాదు.

సబబైన, ప్రజాస్వామ్యసూత్రాల ననుసరించి, ప్రజాస్వామ్య యిండియన్ ఫెడరేషన్ యేర్పాటు కావటానికి అడ్డంకులుగావున్నవనీ, స్వదేశసంస్థానాలను రద్దుచేయటాన్ని యీ రాజ్యాంగం ప్రూహిస్తుంది. పరిసరభాషా రాష్ట్రాల్లో ఆయా భాగాల్ని చేర్చాలని యేర్పాటుచేసింది.

యేవిధంగా సంస్థానాధీశుల హక్కుల్ని రద్దుపరచి, ఆ యా భాగాల్ని వివిధరాష్ట్రాల్లో తాత్కాలిక ప్రభుత్వం చేర్చాలో అన్న విషయాన్నిగురించి సంక్రమణచట్టంలోగాని, రాజ్యాంగంలోగాని చెప్పలేదు. బ్రిటిష్‌ప్రభుత్వం, యీరాజ్యాంగంతోపాటు సంక్రమణచట్టాన్ని చేయక, ముందుగానే, సంస్థానాలతో ఒక అంగీకారానికి వొచ్చి వుండాలి. తాను చెప్పిన విధంగా సంస్థానాలు అంగీకరించాలని చెప్పగలిగిన పరిస్థితుల్లోనేవుంది బ్రిటిష్‌ప్రభుత్వం; యేదోకొంత మనోవర్తి యిస్తా

ననీ, దానితో వారు హాయిగా బతకొచ్చనీ చెప్పుతుంది. సంస్థానాల్ని రద్దుపరిపించే విషయాన్ని గురించిన అంగీకారాన్ని బ్రిటిష్ ప్రభుత్వం అఖిలభారత ఫెడరల్ యూనియన్‌కు సంధిపత్రమూలకంగా అందజేయవొచ్చు, లేదా యీరాజ్యాంగంలోనే తగిన మార్పులు చేయవొచ్చు.

ప్రజల సర్వతంత్ర అధికారాన్ని చలామణి చేయగలిగిన 'నిర్మాణ ప్రజాస్వామ్యం' యీరాజ్యాంగానికి శాసనాధికారాన్ని యిస్తుంది. వోటర్లు వ్యక్తులుగా మాత్రమే వున్నంతకాలం ప్రజాస్వామ్యాన్ని నెగ్గేటట్టుచెయ్యలేరని చరిత్రానుభవం చెప్పుతుంది. యీ రాజ్యాంగానికి పునాది యేర్పాటు చేయబడ్డవిధానం, ప్రజాస్వామ్యాన్ని జేగీయంగా చెయ్యటమేగాక, ప్రజలకు రాజకీయ చైతన్యాన్ని కల్పించేదిగావుంటుంది. అందుకనే, యిండియాలాంటి భారీ దేశంలో, యింతవిద్య తక్కువగావున్నప్పటికీ; మెజారిటీవచ్చిన ప్రతివాడికి వోటింగు వుండాలని చెబుతూ దానిమీద వచ్చిన ఆక్షేపణల్ని వమ్ముచేస్తుంది. నిర్మాణ ప్రజాస్వామ్యమే యింత దేశంలో యెన్నికల్ని యిబ్బంది లేకుండా జరపటానికి వీలు కలుగజేస్తుంది. రాజ్యాంగంలోని కార్యనిర్వాహక, శాసనాధికారాల్ని కలిపిపనిజేయించటంలో వుపకరిస్తుంది. శాసన, నిర్వాహక శాఖాధికారాల్ని విడదీయటం మూలంగా ప్రజాస్వామ్య పద్ధతికి మోసంవచ్చింది; ప్రజల సర్వతంత్ర అధికారాన్ని తగ్గించింది.

యీ రాజ్యాంగం ప్రధానంగా రిపబ్లిక్ పద్ధతిలోది. అటువంటప్పుడు, యీ రాజ్యాంగంలో ముఖ్యుణ్ణి, అధ్యక్షుడనకుండా, గవర్నర్ జనరల్ అని అనటమేమిటని కొంతమందికి

ఆశ్చర్యం వెయ్యవచ్చు. రాష్ట్రాధికారుల్నిగూడా అధ్యక్షులనే పిలవాల్సివుంటుంది. అప్పుడు అధికారరీత్యా కొంతబాధ వుంది. చట్టరీత్యా వారు స్వతంత్రులుగా వుండాలి. ఫెడరల్ విధానానికి ముప్పువస్తుంది. అమెరికాలో, యీచిక్కును, రాష్ట్రాధికారుల్ని, గవర్నర్లని పిలిచి తప్పించుకుంది. అటువంటప్పుడు. ఫెడరేషన్ అధికారిని గవర్నర్ జనరల్ అంటే వచ్చేబాధేమిటి? అమెరికన్ రాజ్యాంగంలో, గవర్నర్లని అధ్యక్షునికి తక్కువ అధికార్లుగాచేసింది. అటువంటి, అస్పష్టతని యీ రాజ్యాంగం తీసివేసింది; యెన్నుకోబడే హోదాయే గనక, యేపేరున్నా యేమీచిక్కుప్రుండదు. గవర్నర్లనిగూడా యెన్నుకునేటట్లు పెట్టటంతో, రాష్ట్రవిషయాల్లో గూడా యేమీ యిబ్బంది వుండదు.

యీచిత్తు రాజ్యాంగంలోని కొన్నిభాగాలు సవ్యంగా భావించబడతై. పాతభావాల్తో రాజ్యాంగాల్ని తిరగేసేవాళ్ళకు కంటుగాగూడా వుండొచ్చు. పాతలోకాన్నే పునరుద్ధరించటం యుద్ధానంతరం కష్టమనేభావం చాలామందికి అంగీకారంగా వుంది' రాజకీయంగాను, ఆర్థికంగాను పాతలోకాన్ని పునర్నిర్మాణం చెయ్యాలి. ఆ నిర్మాణం సార్థకం కావాలంటే, రాజకీయహక్కులకు ఆర్థికహక్కులకు సరైనసంబంధం వుండాలి; అటువంటి సమన్వయం కుదిరితేనేతప్ప, నిజమైన ప్రజాస్వామ్య రాజ్యాంగాలు రావటానికి వీల్లేదు.

యీ యుద్ధంతో వుడికిపోయిన ప్రపంచం మారకతప్పదు. కొత్తప్రపంచం వస్తుంది. ఇండియా ఆ విశాలప్రపంచంలో ఒకభాగం. రానున్న ఆ నూతనయిండియా స్వరూపాన్ని యీ రాజ్యాంగం తయారుచేస్తుంది.

ఇండియాలోని రాజకీయపార్టీలన్నీ దీన్ని బలపరిస్తే, బ్రిటిష్ పార్లమెంటుకు గత్యంతరం వుండదు. పదేపదే, బ్రిటిష్ ప్రభుత్వం లోగడ తానుచేసిన ప్రకటనానుసారం చేస్తుంది. ఇతరరాజకీయపార్టీలు యీరాజ్యాంగాన్ని ఆమోదించకుండా వుంటానికి కారణాలేమీలేవు—నిజంగా వారుచెప్పేది, చేసేది యదార్థమైన స్వాతంత్ర్యమైతే! ఇతర రాజకీయపార్టీలు దీన్ని ఆమోదించకపోతే బ్రిటిష్‌ప్రభుత్వం యేదోసాకుమీద, ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని అమలుపరచటం ఆలస్యంచెయ్యొచ్చు.

ఆపరిస్థితుల్లో, బ్రిటిష్ ప్రజాస్వామ్యాన్ని తనకర్తవ్యాన్ని తానుచేయవలసిందిగా విన్నవిస్తూ, యీ రాజ్యాంగాన్ని పార్లమెంటుచేత ఆమోదపరపించాలని కోరుతూ, రాడికల్ డెమొక్రాటిక్‌పార్టీ యీ రాజ్యాంగాన్ని బలపరిచేందుకు జనాన్ని సమీకరిస్తుంది. యీ సమీకరణఫలితంగా రేగిన చైతన్యం, బ్రిటిష్‌ప్రభుత్వాన్ని వొత్తిడిపెట్టి, గాటిలో కుక్కలవిధానంలో వుంటున్న పాతరాజకీయపార్టీల లొల్లిబొల్లి కేకలకు భయపడకుండా చేస్తుంది. అట్లా జరక్కపోతే, ఇండియా ప్రజలంతా తమ స్వతంత్రహక్కుల్ని, ప్రజాప్రతినిధి పరిషత్తు స్థాపనచేయటం ద్వారా వెలిబుచ్చి, యీ రాజ్యాంగాన్ని నెలకొల్పుకుంటారు.

—యం. యస్. రాయ్

# సంక్రమణ చట్టం

యిండియాలో మంచి ప్రభుత్వాన్ని యేర్పాటు చేయవలసిన బాధ్యతతోనూ, లోగడ తమ ప్రభుత్వం పేరుతో చేయబడ్డ ప్రకటనల ననుసరించి, యిండియాలో స్వపరి పాలన త్వరలో యేర్పాటు చేయవలసనే ఉద్దేశంతో, శ్రీ చక్రవర్తిగారి ప్రభుత్వం,

యీనాడు యీ పార్లమెంటులో సమావేశమైన అందరి ఆమోద, అధికారంతోనూ, పెద్దల సలహాతోనూ,యీ క్రిందివిధంగాచట్టాన్ని ప్రతిపాదించడమైంది.

1. యిండియాని పరిపాలించేఅధికారం, శక్తి యిన్నాళ్ల నుంచి ట్రస్టీగా వుంచుకున్న శ్రీ చక్రవర్తిగారి ప్రభుత్వం సదరు అధికారాన్ని యిందుమూలంగా యిండియా ప్రజలకు మార్చుతుంది.
2. యిన్నాళ్ళనుండి ట్రస్టీగా వుండి, యీనాడు తమ బాధ్యతను నెరవేరుస్తూ, యీపార్లమెంటు యిండియా స్వపరిపాలనకై యిందులో పొందుపరచిన రాజ్యాంగాన్ని, యిండియాప్రజలకు ప్రజాస్వాతంత్రాన్ని ప్రతిపాదిస్తుందనీ, వాళ్ళమంచినే అభివృద్ధి చేస్తుందనీ, బలపరచి, ఆమోదిస్తుంది.
3. నైసర్గికంగా యిండియాఅని పిలువబడుతూవున్న, బ్రిటిష్‌యిండియాకి, స్వదేశ సంస్థానాలకంతటికీ యీ రాజ్యాంగ విధానం వర్తిస్తుంది.
4. యీ రాజ్యాంగ విధానాన్ని ప్రతిపాదించినాక,

లోగడ పార్లమెంటు యిండియాని గురించి చేసిన చట్టాలన్నీ రద్దుచేయబడతై. యింతేగాక, స్వదేశ సంస్థానాలతో చేసుకొన్న సంధులన్నీ యిదివరకే వుభయులుఅంగీకరించివున్న పద్ధతిమీద తుడువుబడతై.

5. యీ రాజ్యాంగం ఒక తాత్కాలిక ప్రభుత్వంచేత అమలు పరచబడుతుంది.

యీ తాత్కాలిక ప్రభుత్వాన్ని గవర్నర్ జనరల్ నియామకం చేస్తాడు;

గవర్నర్ జనరల్‌కువున్న శాసనాధికారమంతా యీ తాత్కాలిక ప్రభుత్వానికి సంక్రమిస్తుంది; యీ ప్రభుత్వానికి గవర్నర్ జనరల్ ప్రధానమంత్రిగా వుంటాడు:

యీ తాత్కాలిక ప్రభుత్వం, రాష్ట్రాల్లోనూ, కేంద్రంలోను యీ రాజ్యాంగం ప్రకారం ప్రభుత్వాలువచ్చినాక రాజీనామా యిస్తుంది. యీ తాత్కాలిక ప్రభుత్వం, యే యెన్నికోబడ్డసంస్థకూ బాధ్యులుకారు. యీ సంక్రమణ చట్టంవల్లనే అది శాసనాధికారాన్ని గడిస్తుంది.

6. యిందుతో పొందుపరచిన రాజ్యాంగాన్ని అమలు పరచటంలో, తాత్కాలిక ప్రభుత్వం, యీదిగువ నుదహరించినట్టే, వాటికి అనుబంధంగా కావలసి వచ్చినట్టే, పనులను చేయుటకు తగిన అధికారాన్ని యివ్వబడింది:—

(ఏ) బ్రిటిష్‌యిండియా, స్వదేశసంస్థానాలు అనే తేడాలేకుండా సైసర్గికంగా యిండియాహద్దుల్లోవున్న భూభాగాన్నంతా, విభజించి, యింతింతజనాభాతో, యీ యీ ప్రాంతాలు ఒక్కొక్క ప్రజా

సంఘంగా వుండాలని నిర్ణయించటం; ఆభాగాల్లో యెన్నికలు యీ రాజ్యాంగంలో పొందుపరచిన షరతుల ప్రకారం జరిపి, ప్రజా సంఘాల్ని నిర్మాణంచెయ్యటం;

(బి) యేకభాష, యేకసంస్కారం కలిగి, పాలనా సౌకర్యం గల రాష్ట్రాలుగా యిండియానంతటిని విభజించటం.

(సి) పైవిధంగా విభజించిన అన్ని రాష్ట్రాల్లోనూ, యీ రాజ్యాంగం ప్రకారం, రాష్ట్ర ప్రజా కౌన్సిళ్ళకు యెన్నికలు జరిపి, గవర్నర్లను యెన్నుకొనేటట్లుచేసి, రాష్ట్ర ప్రభుత్వాల్ని యేర్పాటుచేయటం;

(డి) యీ రాజ్యాంగంలో పొందుపరచిన సూత్రాల ప్రకారంగా, యేవన్నా రాష్ట్రాలు అఖిలభారత ఫెడరల్ యూనియన్‌లో చేరకుండా విడిగా వుండదలుచుకున్నవేమో నిర్ణయించటం;

(యి) ఫెడరల్ యెసంబ్లీకి యెన్నికలు, గవర్నర్ జనరల్ యెన్నికలు, యీ రాజ్యాంగ సూత్రాలప్రకారం జరిపి, స్టేటుకౌన్సిలుకు ప్రతినిధుల్ని నామినేటుచేయించటం, యేపద్భారతానికి సుప్రీమ్ ప్రజాకౌన్సిల్ని యేర్పాటుచేయటం;

(యఫ్) ఫెడరల్ యూనియన్‌లో చేరని రాష్ట్రాలలోకూడా వాటికనుగుణ్యమైన యెన్నికవ్యవహారాలను జరపటం. బయట విడిగావున్న రాష్ట్రాల్ని విడివిడిగా స్వంత రాజ్యాలుగా వుంటయో, లేక అవన్నీ యీ-క్లో ఫెడరేషన్‌గా చేరతయో నిర్ణయించటం.



# స్వతంత్రభారతరాజ్యాంగం

## I

### మానవుని స్వత్వాలు - మూలసూత్రాలు

1. యీదిగువ నుదాహరింపబడ్డ హక్కులను, ప్రజా స్వామ్య స్వతంత్ర మూలసూత్రాలను యేర్పాటు చేసి, అమలుపరిచేందుకు యీ రాజ్యాంగం ప్రతిపాదింప బడింది.

1. పాలనాధికారం సంపూర్ణంగా ప్రజలందరికీ చెందుతుంది. ప్రజాప్రతినిధులద్వారా, కార్యనిర్వాహకవర్గాన్ని చట్టనిర్మాణాన్ని అనుశాసిస్తూ యీ అధికారాన్ని స్వయంగా ప్రజలే చలాయిస్తారు.

2. తమ సంఘంయొక్క రాజకీయ నిర్మాణాన్ని మార్చుకునే అమూల్యమైన హక్కు ప్రజలకుంది.

3. నిరంకుశత్వంమీద, దోపిళ్ళమీద తిరుగుబాటు చేసే పవిత్రమైన హక్కు ప్రజలకుంది.

4. యేకభాష, యేకసంస్కారం కలిగిన భాగాలు సాధ్యమైనంతవరకు స్వతంత్రరాష్ట్రాలుగా విభజింపబడ్తై. ఒక ఫెడరేషన్‌గా తాము కలవటానికి అంగీకరించిటువంటి రాష్ట్రాలన్నీ కలిసి యిండియా యొక్క ఫెడరల్ యూనియన్‌గా సమ్మేళన చెందుతై.

5. ఫెడరల్ యూనియన్‌లో చేరని స్వతంత్రరాష్ట్రాలకు కూడా, చేరినవాటిమాదిరిగానే, ఒకే రకమైన ప్రజాస్వామ్య రాజ్యాంగవిధానం వుండితీరాలి.
6. సంఘంయొక్క రాజకీయ నిర్మాణమే రాజ్యాంగం గనక, అన్నిపరిస్థితుల్లోనూ రాజ్యాంగమంటే ప్రజలందరూ అని స్పష్టంగా తేలాలి.
7. భూమి, ఖనిజ సంపత్తియావత్తూ ప్రజలకు చెందిన సమిష్టి ఆస్తి.
8. ఆధునిక యంత్రాలద్వారా వుత్పత్తిచేస్తూ, శ్రమయొక్క వుత్పత్తిశక్తిని పెంపొందించటం ప్రభుత్వంయొక్క బాధ్యత.
9. ప్రధానపరిశ్రమలూ, అరువు పద్ధతులు ప్రభుత్వయాజమాన్యంకింద వుండాలి.
10. భారీపరిశ్రమల్ని ప్రభుత్వం సమిష్టిపరంగా చెయ్యాలి.
11. శాసన రీత్యా నిర్ణయింపబడ్డ ఒకేపద్ధతిపైన భూమిశిస్తు చెల్లించే బాధ్యతతో, ఏమీ చిక్కు లేకుండా, వ్యవసాయదార్లు భూమిని స్వంతంగా వుంచుకోవచ్చు.
12. ఆధునిక యంత్రాల సరఫరాద్వారా, తక్కువవడ్డీకి అరువులు యిచ్చి ప్రభుత్వం పెద్దయెత్తున కోఆపరేటివ్ వ్యవసాయాన్ని పెంపొందించాలి.
13. పొలాల్లోనూ, ఫ్యాక్టరీల్లోనూ, గనుల్లోనూ, రాకపోకల్లోనూ, ఆఫీసుల్లో, పాఠశాలల్లో, పనిచేసే

యావన్మందికీ, శనీసవేతన నిర్ణయంతోవుండి, తగ్గని జీవనపరిమాణాన్ని గ్యారంటీ చెయ్యాలి.

14. తగినప్రతిఫలంవచ్చే వుద్యోగం పౌరసత్వపుహక్కు.

15. యెవరూ రోజుకు 8 గంటలకు, వారానికి 6 రోజులకు, మించి పనిచెయ్యగూడదు. ప్రతిపనివానికి జీతం వస్తూనే సంవత్సరాని కొకనెల సెలవుండాలి. ప్రసవ కారణాలకు సంబంధించి స్త్రీలకు పూర్తి జీతం వస్తూనే 3 నెలల సెలవుండాలి.

16. ముసలివాళ్ళకు, రోగగ్రస్తులకు, యితర కారణాల వల్ల పనిచెయ్యలేనివాళ్ళకు శాసనరీత్యా సోషల్ సెక్యూరిటీ వుండాలి.

17. 14 సంవత్సరాలవరకు పిల్లలందరికి వుచిత, నిర్బంధ విద్య వుండితీరాలి.

18. ప్రజారోగ్యాన్ని అన్నివిధాల పెంపొందించటం ప్రభుత్వబాధ్యత.

19. పత్రికా, వాక్స్వాతంత్రం ఒక్క ప్రజాశత్రువులకు తప్ప అందరికీ గ్యారంటీ చెయ్యబడుతుంది.

20. శ్రామికులకు, కూలీలకు, రైతులకు స్వరక్షణార్థమున్నూ, తమ ఆర్థిక, రాజకీయ స్థితిని బాగుచేసుకునేందుకున్నూ, సమావేశపు హక్కు గ్యారంటీ చెయ్యబడుతుంది.

21. ఇండియా ఫెడరల్ యూనియన్ పౌరులందరికీ వ్యక్తిరక్షణ గ్యారంటీచెయ్యబడుతుంది. కోర్టువారి వుత్తర్వు లేనిదేయెవ్వరినిఅరెస్టుచెయ్యగూడదు.

22. గ్రుహరక్షణ, వుత్తర ప్రత్యుత్తరాల శాసన రీత్యారక్షింపబడతై.
23. ప్రతిపౌరునికి ప్రార్థనా స్వాతంత్రం సంపూర్ణ వుంటుంది.
24. స్త్రీలకు, పురుషులకు సమాన పౌరసత్వహక్కులు, బాధ్యతలు వుంటై.
25. అల్పసంఖ్యాకుల హక్కుల్ని, అన్ని పబ్లిక్ సంస్థల్లోనూ ప్రత్యేకమైనట్టీ, తమసంఖ్యాబలానికితగినట్టీ, ప్రాతినిధ్యంద్వారా రక్షించాలి.

## II

## అధికారమూలం

2. సర్వాధికారం ప్రజల్దే.
3. రాజ్యాంగానికి పునాది నిర్మాణప్రజాస్వామ్యం.
4. సర్వతంత్ర ప్రజాస్వామ్య అధికారం స్థానికంగా వుండే, గ్రామ, పట్టణ, ప్రజాసంఘాలద్వారా వ్యక్తమౌతుంది.
5. ప్రజాసంఘాలు, 18 సంవత్సరాలు వచ్చిన ప్రతి వ్యక్తిచేత ఆయా ప్రాంతాల్లో ప్రతిసంవత్సరం యెన్నుకోబడతై.
6. ఆయా ప్రాంతాల్లోవున్న వోటర్ల సంఖ్యలో అయిదవవంతు ప్రజాసంఘాల్లో సభ్యులుగా వుంటారు.
7. యీ రాజ్యాంగం కింద శాసనబద్ధంగా యీప్రజాసంఘాలయొక్క స్థల నిర్ణయం, జనాభానిర్ణయం

చెయ్యబడుతుంది.

8. ప్రజాసంఘాలయొక్క కర్తవ్యాలు :—

(ఎ) పౌరులకున్న సర్వతంత్ర హక్కును, వ్యక్తిగతంగానూ, సమిష్టిగానూ సరిగా వినియోగించేందుకు సహాయంచెయ్యటం,

(బి) ప్రజాస్వామ్య శక్తిని నిశితంగా పనిచేసేటట్లు చేయ్యటం.

9. ప్రజాసంఘాలు, తమకున్న సర్వతంత్ర ప్రజాస్వామ్య హక్కులద్వారా, యీ దిగువ నుదహరించిన పనులు, రాష్ట్రాల్లోగాని, ఫెడరల్ ప్రభుత్వంలోగాని, చేస్తే :—

(ఎ) ఫెడరల్ యెసంబ్లీకీ, రాష్ట్ర ప్రజాకౌన్సిళ్ళకు, అభ్యర్థుల్ని నియామకం చెయ్యటం,

(బి) ఫెడరల్ యెసంబ్లీలో, రాష్ట్ర ప్రజాకౌన్సిళ్ళలోవున్న ప్రతినిధులకు మార్గదర్శకంగా వుంటానికి ప్రజల అభిప్రాయాల్ని సతతం వెల్లడి చేయటం,

(సి) ఫెడరల్ యెసంబ్లీలో, రాష్ట్ర ప్రజాకౌన్సిళ్లలో చెయ్యబోయేశాసనాలనుచర్చించి, వాటిపైప్రజాభిప్రాయాన్ని వెల్లడించేందుకు,

(డి) ఫెడరల్ యెసంబ్లీలోకిగాని, రాష్ట్రాల్లోగాని పంపబడ్డ ప్రతినిధులు తమ యెన్నికస్థానాల్లోని ప్రజాభిప్రాయాను సారం పని చెయ్యలేకపోతే, వారిని బర్తరఫ్ చెయ్యటానికి సిఫార్సు చెయ్యటం,

(ఇ) గవర్నరు జనరల్‌ల్నిగాని, గవర్నల్నిగాని బర్తరఫ్ చెయ్యటానికి సిఫార్సుచెయ్యటం,

(యఫ్) ఫెడరల్ యెసంబ్లీద్వారాగాని, రాష్ట్రప్రజా కౌన్సిళ్ల ద్వారాగాని శాసనాల్ని ప్రతిపాదించటం,

(జి) ఫెడరల్ యెసంబ్లీకి చెందినా, రాష్ట్రానికిచెందినా, కార్య నిర్వాహక విషయంలోగాని, శాసనవిషయంలోగాని ప్రజామోదం కోసం, ఆవిషయాన్ని తిప్పిపంపటం.

III

## ఫెడరల్ యూనియన్ - దాని నిర్మాణం

10. యీ రాజ్యాంగం యావద్భారత దేశానికి — బ్రిటిష్ యిండియా, స్వదేశ సంస్థానాలకు — అనువర్తిస్తుంది.

11. తాత్కాలిక ప్రభుత్వం, ఏక భాషా, ఏక సంస్కారం, పాలనా సౌకర్యాలు [illegible]గా రాష్ట్ర నిర్ణయం చేయగా, అంగీకరించిన రాష్ట్రాలన్నీ యావద్భారత ఫెడరల్ యూనియన్ అనే పేరుతో ఒక ఫెడరల్ రాజ్యాంగంగా ఏర్పాటవుతాయి.

అయితే, అట్లా అంగీకరించని రాష్ట్రమేదయినా ఫెడరల్ యూనియన్‌కు బయటవుండదలిస్తే, [illegible] వుండవచ్చు.

12. ఫెడరల్ యూనియన్ ఏర్పడటానికి పూర్వమే, యీ రాజ్యాంగ సూత్రాలకింద వివిధ రాష్ట్రాల్లో యెన్నుకోబడ్డ కౌన్సిళ్లు, ఆయా రాష్ట్రంగాని, రాష్ట్రాలుగాని ఫెడరల్ యూనియన్‌లో వుండకుండా బయటనే వుంటామని సిఫార్సులు పంపుకోవచ్చు.

సదరు సిఫార్సు రాష్ట్రప్రజా కౌన్సిళ్లలో మెజారిటీచేత ఆమోదింపబడితే, దాన్ని ఆ రాష్ట్రంలో వున్న వోటర్ల ఆమోదంకోసం తిప్పి పంపుతారు.

యీతిప్పిపంపిన ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవటం, రాష్ట్రంలో యీ రాజ్యాంగం ప్రకారం యెన్నుకోబడ్డ రాష్ట్రప్రభుత్వం చేస్తుంది.

యీసిఫార్సు అమలుయోగ్యం కావాలంటే ప్రజల్లో మెజారిటీ ఆమోదాన్ని పొందాలి.

13. ఫెడరల్ యూనియన్‌లో చేరని రాష్ట్రాలు, ఫెడరల్ భాగంతో సంబంధంలేని యీ రాజ్యాంగం లోని యితర సూత్రాలన్నిటితోను నడుపబడతై.
14. ఫెడరల్ యూనియన్‌లో చేరని రాష్ట్రాలన్నీ, యింకో ఫెడరేషన్‌గా యేర్పాటు కావచ్చు.
15. ఫెడరల్ యూనియన్, తనలోచేరక బయటవున్న యితర రాష్ట్రాలతోగాని, అవి యేర్పాటుచేసుకున్న ప్రత్యేక ఫెడరేషన్‌తోగాని వుభయుల శ్రేయస్కారానికి, సహకారానికి సంధుల్ని చేసుకుంటుంది. కరెన్సీ, రైళ్లు, టెలిగ్రాఫ్, రవాణావగైరా.
16. యావద్భారత ఫెడరల్ యూనియన్, అంతకన్నా పెద్దదైన బ్రిటిష్ కామన్‌వెల్త్‌లో ఒకటిగా వుంటుంది. అట్లా వుండటమనేది, ఇండో—బ్రిటిష్ కామన్‌వెల్త్ అనే పేరుపెట్టినప్పుడూ, వుభయ ప్రజలకు సమాన ప్రతిపత్తులు వున్నప్పుడూ జరుగుతుంది.
17. యీ రాజ్యాంగసూత్రాలకు భిన్నంగా లేనప్పుడే, యిండియా, యిండో బ్రిటిష్ కామన్‌వెల్తులో యే షరతులమీద చేరటమా అనే విషయాన్ని గురించిన సంధిబేరాలు చేయటం.
18. మొదటి ప్రకరణంలో పొందుపరచిన మూల సూత్రాను సారంగావుండి, ఫెడరల్ యూనియన్ లోని వివిధరాష్ట్రాలు వ్యత్యాసాలు లేకుండా ఒకే రకమైన ప్రజాస్వామ్యాలుగా వుండాలి.

ఫెడరల్ యూనియన్‌లో చేరిన ప్రతిరాష్ట్రం, మొదటి ప్రకరణంలో చెప్పబడ్డపౌరునికివుండవలసిన హక్కులన్నీ యేర్పాటుచెయ్యాలి.

19. ఫెడరల్ యూనియన్ నిర్మాణమైనాక, అందులో వున్న వివిధరాష్ట్రాలు, యూనియన్‌నుంచి చీలి పోదలుచుకుంటే, అట్లా చీలిపోయే హక్కును స్వతస్సిద్ధంగా పొందివుంటై.

అట్లా చీలిపోవాలనే ప్రతిపాదన, అప్పుడు రాష్ట్రంలోవున్న ప్రభుత్వంచేత ప్రజాభిప్రాయంకోసం తిప్పిపంపబడుతుంది. మెజారిటీ వోట్లు యీ ప్రతిపాదనకొస్తే అదినెగ్గుతుంది; ఆచరణ యోగ్యమౌతుంది.

20. ఫెడరల్ యూనియన్ పొలిమేరల్లో, సుప్రీమ్‌ప్రజా కౌన్సిలు, రాజ్యాంగంలోని సర్వాధికారాన్ని పొందినదిగా వుంటుంది.

ఫెడరల్ యెసంబ్లీ, స్టేట్ కౌన్సిలు, గవర్నరుజనరల్ కలిసి యీ సుప్రీమ్ ప్రజాకౌన్సిలు అవుతుంది.

## IV

## ఫెడరల్ యెసంబ్లీ

21. ఫెడరల్ యూనియన్‌లోని ప్రజా ప్రతినిధులతో చేరింది ఫెడరల్ యెసంబ్లీ.

22. 5,00,000 జానాభాకు ఒక ప్రతినిధి వుంటాడు.

1,00,000 మందికిపైగా జనాభావున్న పట్నాల్లో, 2,50,000 మంది ప్రజలకొక ప్రతినిధి చొప్పున వుంటాడు.

నియోజకవర్గాల్ని నిర్ణయించేటప్పుడు యీపట్నాల్ని నిర్ణయిస్తారు.

23. 18 యేళ్లు దాటిన ప్రతి స్త్రీ, పురుషులకు ఫెడరల్ యెసంబ్లీ ప్రతినిధుల యెన్నికల్లో వోటింగు హక్కువుంది.

24. ప్రతివోటరుకు ఫెడరల్ యెసంబ్లీకి యెన్నికకు నిలబడే అధికారం వుంది.

25. ఫెడరల్ యెసంబ్లీ ప్రతినిధులు యీదిగువ పద్ధతులతో యెన్నుకోబడతారు.

(ఏ) స్థానిక ప్రజాసంఘాల పొలిమేరల్లోవున్న వోటర్లందరూ, 100 కి ఒక యెన్నికదారుణ్ణి చొప్పున నిర్ణయిస్తారు.

(బి) ఒక నియోజక వర్గంలోని యెన్నిక దార్లందరూ కలిసి ఫెడరల్ యెసంబ్లీకి తమ ప్రతినిధిని యెన్నుకుంటారు.

(సి) ప్రతినిధి యెన్నికదారుడైనా, కాకపోయినా ఫరవాలేదు.

(డి) యెన్నికదారుడు ప్రతినిధిగా నిలబడితే, తన వోటును తానే వేసుకోవచ్చు.

(యి) ప్రజాసంఘాలే రాజ్యాంగం తరఫున యెన్నికల్ని జరుపుతై. యెన్నికదార్ల పట్టీలు తయారు చేసి, యెన్నికలకు కావలసిన ప్రకటనలువగైరా పనులన్నీ యీ సంఘాలేచేస్తై.

(యఫ్) ఫెడరల్ యెసంబ్లీకి ప్రతినిధుల్ని యెన్నుకునేటప్పుడు, యెన్నికదార్లకు అయిన ఖర్చులు ఫెడరల్ ప్రభుత్వమే భరిస్తుంది.

(జి) యే యెన్నికలైనా, సెలవురోజుల్లోనే జరగాలి. ఆరోజు కూలీలకి జీతాలు పూర్తిగా యివ్వాల్సిందే.

యెన్నికలకు కావలసిన పూర్తివివరాలన్నీ తాత్కాలిక ప్రభుత్వం తయారుచేస్తుంది.

26. ఫెడరల్ యెసంబ్లీ యెన్నికలు నాలుగు సంవత్సరాలకొకసారి జరుగుతై.

27. ఫెడరల్ యెసెంబ్లీ సభ్యులకు జీతాలు యేర్పాటు చేయబడై.

28. ప్రతిసారి యెన్నికలు జరిగిన మూడుమాసాలలోగా ఫెడరల్ యెసెంబ్లీ సమావేశం జరగాలి.

ఫెడరల్ యెసెంబ్లీ సమావేశాల మధ్య ఆరునెలలకన్నా వ్యవధి వుండకూడదు.

29. ఫెడరల్ యెసెంబ్లీ జీవితం పూర్తికాకముందే, ప్రధానమంత్రి సిఫారసుమీద, గవర్నర్ జనరల్ దాన్ని రద్దు చెయ్యవొచ్చు.

30. ప్రధానమంత్రి సిఫారసుమీద గవర్నర్ జనరల్ యెసెంబ్లీని రద్దుచేయకపోవచ్చు. కాని, ఆపరిస్థితుల్లో ఫెడరల్ యూనియన్ లోని ప్రజాసంఘాల అభిప్రాయంకోసం యీ వివాదాన్ని వాళ్ళకు పంపుతూ, తాను ప్రధానమంత్రి చెప్పినప్రకారం చెయ్యనందుకు కారణాల్ని తెలియపరచాలి.

31. ప్రజాసంఘాలు యీ వివాదాన్ని మెజారిటీ వోటుతో నిర్ణయిస్తై. ఒక్కొక్క సంఘాని కొక్కొక్క వోటువుంటుంది.

32. తనంతటతానే, గవర్నర్ జనరల్ ఫెడరల్ యెసెంబ్లీని రద్దుచెయ్యొచ్చు. యీనిర్ణయంగూడా, ప్రజాసంఘాల్లో మెజారిటీ ఆమోదిస్తేనే వుంటుంది.

33. పాతయెసెంబ్లీ రద్దయిన 90 రోజుల్లో కొత్త యెసెంబ్లీకి యెన్నికలు జరగాలి. 60 రోజులకన్నా ముందు జరగటానికి వీల్లేదు.

## V

## స్టేట్ కౌన్సిలు

34. ఫెడరల్ సమాఖ్యలోచేరిన రాష్ట్రీయ ప్రభుత్వాలు, స్టేట్ కౌన్సిలు సభ్యుల్ని నియామకం చేస్తై.

35. అన్ని రాష్ట్రాలకు సమానంగానే యీ సభ్యత్వం వుంటుంది.

36. స్టేట్ కౌన్సిలు సభ్యులు యీ కింది విధంగా యేర్పాటు చేయబడతారు:

(ఏ) యింజనీర్లు, అర్థశాస్త్రవేత్తలు, విజ్ఞానశాస్త్రవేత్తలు, డాక్టర్లు, ధర్మశాస్త్రవేత్తలు, చరిత్రకారులు—వీరంతా ఒక్కొక్క వృత్తికి చెందినవాళ్లను 10 మందిని నామినేటు చేస్తారు. రాష్ట్రప్రభుత్వాలు, యీ పదిమందిలోనుంచి, యిద్దర్ని స్టేట్ కౌన్సిలు సభ్యులుగా నియమిస్తుంది.

(బి) యింకా వేదాంతంలోగాని, సాంఘిక విజ్ఞానశాస్త్రంలోగాని బాగా కృషిచేసి, మేధావంతమైన విషయాల్ని చెప్పినవాళ్లలో యిద్దర్ని రాష్ట్రప్రభుత్వం సభ్యుల్నిగా నియమిస్తుంది.

(సి) వీళ్లకితోడు, సివిల్ వుద్యోగుల్ని ముగ్గుర్ని రాష్ట్రప్రభుత్వాలు సభ్యుల్నిగా నియమిస్తై.

37. యీవిధంగా వృత్తుల్లోనుంచి తీసుకోబడే సభ్యులు, జీతంమీదకాక, యితరత్రా షరతులతో యే వాణిజ్య, పారిశ్రామిక సంస్థల్తో సంబంధాన్ని పొందివున్నా, స్టేట్ కౌన్సిలు సభ్యుడుగా వుంటానికి అర్హుడుకాడు.

వుపాధ్యాయవృత్తిలో వున్న వాళ్ళకు యెంతటి సావకాశం యివ్వబడుతుంది.

38. రాష్ట్రీ ప్రభుత్వాలు, స్టేట్ కౌన్సిలు సభ్యత్వాన్ని రద్దుచేసే అధికారం కలిగివుండవు.

39. స్టేట్ కౌన్సిలుసభ్యులు 6 సంవత్సరాలకు నియమింపబడతారు; తిరిగి నియామకానికి గూడా అర్హాతుంది.

40. స్టేట్ కౌన్సిలుకు అధ్యక్ష కూటమి వుంటుంది. వృత్తివర్గాలన్నీ, ఒక్కొక్క వర్గాని కొకణ్ణిచొప్పున అధ్యక్ష కూటమికి ప్రతినిధుల్ని నిర్ణయించాలి.

41. ఫెడరల్ యెసంబ్లీతోపాటే, స్టేట్ కౌన్సిలుగూడా సమావేశాల్ని జరుపుతుంది.

42. ఫెడరల్ యెసంబ్లీ సమావేశంలో లేనప్పుడుగూడా, ఆర్థిక రాజకీయ, పరిపాలనా విషయాల్ని గురించి యేవైనా అర్జంటుగా సలహాలు కావాల్సివస్తే, స్టేట్ కౌన్సిలు సమావేశమై మంత్రులకు సలహాల నివ్వొచ్చు.

43. సంఘంలోని వివిధశాఖల అభివృద్ధికి తగినస్లానింగు నిర్ణయించే అధికారం స్టేట్ కౌన్సిలుకుంది—ఆర్థిక, విద్యా, ఆరోగ్య, సంస్కృతి విషయాలు వగైరా.

## VI

## సుప్రీమ్ ప్రజాకౌన్సిల్.

44. స్టేట్ కౌన్సిలు, ఫెడరల్ యెసంబ్లీలు రెండూ జాయింటుగా గవర్నర్ జనరల్ అధ్యక్షతను సుప్రీమ్ ప్రజాకౌన్సిల్ గా సమావేశమాతుంది.

45. ఈ సుప్రీమ్ ప్రజాకౌన్సిల్ సమావేశాలు గవర్నర్ జనరల్‌చే జరుపబడ్తాయి.

46. రాజ్యాంగాధికారాన్ని వినియోగించే పెద్దగా, ఈ సుప్రీమ్ ప్రజాకౌన్సిల్, ప్రభుత్వంయొక్క కార్యనిర్వాహక, శాసనాధికారాల్ని అనుశాసిస్తుంది.

## VII

## గవర్నర్ జనరల్

47. ఫెడరల్ యూనియన్‌లో 18 సంవత్సరాలు దాటిన యావన్మంది ప్రజలచేత గవర్నర్ జనరల్ 5 సంవత్సరాలకొకసారి ఎన్నుకోబడతాడు.

48. ఫెడరల్ యూనియన్‌లోవుండే, 30 సంవత్సరాలు దాటిన ప్రతివ్యక్తి గవర్నర్ జనరల్‌గా పోటీచేయుటానికి అర్హుడు.

49. సుప్రీమ్ ప్రజాకౌన్సిల్‌గా సమావేశమయ్యే ఫెడరల్ ఎసెంబ్లీ, స్టేట్ కౌన్సిళ్ళ ప్రతిసమావేశంలోనూ గవర్నర్ జనరల్ అధ్యక్షత వహిస్తాడు.

50. సుప్రీమ్ ప్రజాకౌన్సిలు అనుమతిపొందిన అన్ని శాసనాలమీద గవర్నర్‌జనరల్ సంతకాలుపెట్టి, సీళ్లు వేస్తాడు.

51. గవర్నర్‌జనరల్ ఫెడరల్ ఎసెంబ్లీలను రద్దుపరచి, కొత్త ఎసెంబ్లీకి ఎన్నికలు వగైరాలు, ఈ రాజ్యాంగంలోని సూత్రాలప్రకారం జరుపుతాడు.

# VIII

## శాసనాధికార సంస్థలు

**52.** ఫెడరల్ యూనియన్ తాలూకు శాసనాధికారం ఫెడరల్ యెసంబ్లీకి చెందివుంది.

**53.** అధికారాల్లో భాగనిర్ణయాలేమీ వుండవు.

**54.** ఫెడరల్ యెసంబ్లీకి అన్నివిషయాల్లోనూ శాసనాధికారం వుంది.

ఫెడరల్ యెసంబ్లీచేత చేయబడ్డ శాసనాలు, సుప్రీమ్‌ప్రజాకౌన్సిల్ ఆమోదాన్ని పొందితే, ఫెడరల్ యూనియన్‌లో వున్న రాష్ట్రాలన్నిటి మీద చెలామణీఅవుతై.

**55.** ఫెడరల్ యెసంబ్లీచేసిన శాసనాలన్నీ ఫెడరల్ యూనియన్‌లో చేరిన రాష్ట్రప్రజాకౌన్సిళ్ళ అమోదంకోసం పంపబడతై.

**56.** క్రిందిగువ పొందుపరచిన విషయాలమీద ఫెడరల్ యెసంబ్లీచేసిన శాసనాలు రాష్ట్రీయప్రజాకౌన్సిళ్ల ఆమోదాన్ని పొందనవసరంలేదు.

రక్షణ, విదేశాంగవిషయాలు, విదేశవర్తకం, రవాణా, కరెన్సీ, పోస్టు, టెలిగ్రాఫ్, రైల్వేపరిపాలన, నౌకాస్థానాలు, నౌకాగమనం, విమానప్రయాణాలు వగైరా.

**57.** పైనచెప్పిన విషయాలుకాక, ఇతరత్రా విషయాల మీద ఫెడరల్ యెసంబ్లీచేసిన శాసనాల్ని రాష్ట్రీయ ప్రజాకౌన్సిళ్లు యెదుర్కోవచ్చు.

ఏరాష్ట్రమైతే వ్యతిరేకిస్తుందో, ఆరాష్ట్రంలోని ప్రజాసంఘాలు యీ విషయాన్ని తీర్పుపంపుతారు.

యేవైపుకు యెంగ్గుగా ప్రజాసంఘాల అభిప్రాయంవుంటుందో, అది నెగ్గుతుంది.

ఒకవేళ, ప్రజాసంఘాల అభిప్రాయం రాష్ట్రాభిప్రాయానికే అనుకూలంగావుంటే, రాష్ట్రానికి కేంద్రానికివచ్చిన యీ తగాదాను, మళ్లీ ఫెడరల్ యూనియన్ లోవున్న ప్రజాసంఘాల అభిప్రాయంకోసం పంపుతారు.

యీ అభిప్రాయంవచ్చే టంకవరకూ ఆశాసనం ఫెడరల్ యూనియన్ లో చలామణి అవుతుండవలసిందే.

ఫెడరల్ యూనియన్ లోని ప్రజాసంఘాలఅభిప్రాయం రాష్ట్రానికే అనుకూలంగావుంటే, ఆ శాసనంరద్దుఅవుతుంది.

లేక, ఫెడరల్ యూనియన్ లోని ప్రజాసంఘాల అభిప్రాయం రాష్ట్రానికి వ్యతిరేకంగావస్తే, ఆరాష్ట్రప్రజాకౌన్సిలు ఆశాసనాన్ని చట్టంగా ఆమోదించవలసిందే.

58. శాసనాల్ని ప్రతిపాదించేహక్కు వుండేది—

(ఏ) మంత్రివర్గానికి,

(బి) ఫెడరల్ యెసంబ్లీలోని అనధికార సభ్యులకు.

తేబోయేశాసనం, పన్నులువిధించేదైనా, లేక, ఫెడరల్ అర్థి కాన్ని వ్యయపరచేదైనా మంత్రివర్గంచేత మాత్రమే ప్రతిపాదింపబడాలి.

59. ప్రతిపాదింపబడే ప్రతిశాసనం, ముందుగా స్టేట్ కౌన్సిల్ లో చర్చింపబడాలి.

స్టేట్ కౌన్సిల్ ఒకవేళ బిల్లును తిరస్కరించినా, మంత్రివర్గం దాన్నే తిరిగి ఫెడరల్ యెసంబ్లీలో ప్రతిపాదింపవొచ్చు.

ఆపరిస్థితుల్లో, స్టేట్ కౌన్సిల్ అభిప్రాయాన్ని, దానికి వారికారణాల్ని స్టేట్ కౌన్సిల్ సభ్యుడొకడు ఫెడరల్ యెసంబ్లీలో విన్నవిస్తాడు.

60. స్టేట్ కౌన్సిల్ యొక్క నిరాకరణ, ఫెడరల్ అసెంబ్లీలో బిల్లును ప్రతిపాదించటానికి ప్రతిబంధకం కాదు.

61. ఫెడరల్ అసెంబ్లీ చేసిన ప్రతిశాసనాన్ని, సుప్రీమ్ ప్రజాకౌన్సిల్ యొక్క ఆమోదాన్ని పొందితే తప్ప, గవర్నర్ జనరల్ సంతకం పెట్టి, అమలుపరచడు.

62. రాష్ట్రప్రజా కౌన్సిళ్లు చేసిన యే శాసనాన్ని అయినప్పటికీ, ఫెడరల్ రాజ్యాంగానికి వ్యతిరేకంగా వున్నా, ఫెడరల్ లాను భంగపరచినా, సుప్రీమ్, ప్రజాకౌన్సిలు రద్దుచేయగల అధికారాన్ని పొంది వుంది.

రాష్ట్రాలు చేసిన వ్యతిరేకశాసనాన్ని, మంత్రివర్గ సిఫార్సుమీద గాని, తనంతటతానే గాని, గవర్నర్ జనరల్ రద్దుచేయవలసిందిగా సిఫార్సు చేస్తాడు.

యీ రద్దును గురించి, ఆ రాష్ట్రప్రభుత్వం సుప్రీమ్ ఫెడరల్ కోర్టులో అపీలు చేసుకోవచ్చు.

63. రాష్ట్రశాసనానికి, ఫెడరల్ శాసనానికి విరుద్ధంవస్తే, ఫెడరల్ శాసనమే గణ్యమౌతుంది.

## IX

## కార్యనిర్వహణాధికారం

64. గవర్నర్ జనరల్ అఖిలభారత ఫెడరల్ యూనియన్‌కు ప్రధానకార్యనిర్వాహకుడు.

65. ఫెడరల్ యూనియన్ యొక్క ప్రభుత్వం ఒక మంత్రివర్గంచేత నడపబడుతుంది.

66. యీ మంత్రివర్గం అన్నివిషయాల్లోనూ సుప్రీమ్ ప్రజాకౌన్సిలుకు బాధ్యులుగా వుంటారు.

67. ఫెడరల్ అసెంబ్లి సభ్యుల్లో ఒకణ్ణి ప్రభుత్వాన్ని యేర్పాటు చేయవలసినదిగా గవర్నర్ జనరల్ ఆదేశిస్తాడు. అవిధంగా ఆదేశింపబడ్డ సభ్యుడు, అసెంబ్లీ సభ్యుల్లోనుంచి మంత్రివర్గాన్ని యేర్పాటుచేస్తాడు. అతణ్ణి ప్రధానమంత్రి అని పిలుస్తారు.

68. సుప్రీమ్ ప్రజాకౌన్సిలు ఆదరాభిమానాల్ని పొందినన్నాళ్ళు మంత్రివర్గం ఆఫీసులో వుంటుంది.

69. సుప్రీమ్ ప్రజాకౌన్సిలులోవున్న రెండు సభల్లో దేన్లోనైనా మంత్రివర్గంమీద విశ్వాసరాహిత్య తీర్మానం ప్యాసు చెయ్యొచ్చు. కాని, సుప్రీమ్ప్రజాకౌన్సిలు యీ విశ్వాసరాహిత్య తీర్మానాన్ని బలపరచేంతవరకు మంత్రివర్గం రాజీనామా నివ్వనవసరం లేదు.

70. మంత్రివర్గంయొక్క బాధ్యత సమిష్టిగావుంటుంది.

71. స్టేట్ కౌన్సిలు సభ్యులెవ్వరూ మంత్రివర్గంలో వుండగూడదు.

72. ప్రభుత్వంయొక్క వివిధశాఖలు, సుప్రీమ్ ప్రజాకౌన్సిలుచే నియామకం చేయబడ్డ స్థాయీసంఘాల యజమాయిషీలో వుంటై.

ప్రతి స్థాయీసంఘంలో, ఫెడరల్ అసెంబ్లీనుండి 11 మంది సభ్యులు, స్టేట్ కౌన్సిలునుండి 8 మంది సభ్యులువుంటారు; స్టేట్ కౌన్సిలు సభ్యులు వృత్తిముఠాల ననుసరించి వుంటారు.

ప్రతి స్థాయీసంఘానికి స్టేట్ కౌన్సిలు సభ్యుణ్ణి ఒకణ్ణి కార్య దర్శిగా నియమిస్తారు.

కార్యదర్శి యీ స్థాయీసంఘాల సమావేశకర్తగా వుంటాడు.

యీ స్థాయీసంఘాలు, ఆయాశాఖల తాలూకు మంత్రి అధ్యక్షత కింద జరుగుతై.

73. ఫెడరల్ యూనియన్‌లో వున్న రాష్ట్రప్రభుత్వాలు ఫెడరల్ శాసనాన్ని అమలుపరుస్తై; యీ అమలు ఫెడరల్ కార్యనిర్వాహకులదర్శకత్వాన జరుగుతుంది.

# X

## రాష్ట్రాలు

74. రాష్ట్రాలన్నీ—ఫెడరేషన్‌లో చేరినవి, చేరనివి—యీ రాజ్యాంగసూత్రాలప్రకారం ప్రజాస్వామ్యాలుగావుంటే, వాటికి సంపూర్ణ స్వపరిపాలనాధికారంవుంది.

75. ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రాలకు యెంతగా సంపూర్ణాధికారాలున్నైయో చూడాలంటే, అవి ఇష్టంవచ్చినప్పుడు ఫెడరేషన్ నుండి విడిపోవచ్చుని చెప్పటంలోనే అర్థమౌతుంది.

76. ప్రజాప్రతినిధులు, గవర్నర్‌తో వున్న రాష్ట్రీయ ప్రజాకౌన్సిలురాష్ట్రంలోకల్లా గొప్పఅధికారసంస్థ.

77. అధికారాన్ని పంచటంవుండదు. కార్యనిర్వాహక, శాసనాధికారాలు రెండూ రాష్ట్రీయప్రజాకౌన్సిళ్లే నిర్వహిస్తై.

78. ప్రతిరాష్ట్రానికీ ఒక గవర్నరుంటాడు. ఆయనే రాష్ట్రంలోకల్లా ప్రధానకార్య నిర్వాహకుడు.

79. 18 సంవత్సరాల వయస్సుగల ప్రతిపౌరునిచేత గవర్నర్ ప్రతిరాష్ట్రంలోనూ యెన్నుకోబడతాడు

80. గవర్నర్ 5 సంవత్సరాలు వుద్యోగంలోవుంటాడు.

30 యేళ్లుదాటిన ప్రతిపౌరుడూ గవర్నర్ యెన్నికకు నిలబడటానికి అర్హుడు.

81. 18 సంవత్సరాల వయస్సుగల ప్రతిపౌరునిచేత రాష్ట్రీయప్రజాకౌన్సిళ్లకు ప్రతినిధులు సూటిగా యెన్నుకోబడతారు.

82. 1,00,000 మంది జనాభాకొక ప్రతినిధిచొప్పున యెన్నుకోబడతారు. 25,000 యెక్కువ జనాభాగల పట్నాల్లో, 50,000 కొక ప్రతినిధిచొప్పున యెన్నుకోబడతాడు—

83. రాష్ట్రీయ ప్రజ కౌన్సిళ్లకు ప్రతినిధులు యీకింది విధంగా యెన్నుకోబడతారు.

(ఏ) ప్రజాసంఘాలు రాష్ట్రంలో యెన్నికల్ని జరుపుతై. వోటర్ల పట్టీలు తయారుచేస్తై. అధికార ప్రకటనలన్నీ ప్రజాసంఘాలద్వారా చెయ్యబడతై.

(బి) ప్రతివోటరు రాష్ట్రీయప్రజాకౌన్సిలుకు యే నియోజక వర్గంనుండయినా యెన్నికకు నిలబడొచ్చు.

(సి) యెన్నికరోజుల్లో సెలవు వుండాలి. వేతనాలు యీ రోజులికి పూర్తిగా యివ్వాలి.

84. రాష్ట్రీయ ప్రజాకౌన్సిళ్లకు ప్రతినిధులు 4 సంవత్సరాలకొకసారి ఎన్నుకోబడాలి.

85. రాష్ట్రీయ ప్రజాకౌన్సిల్ సభ్యులు జీతాల్ని పొందుతారు.

86. రాష్ట్రీయ ప్రజాకౌన్సిళ్లు ఎన్నికలైన మూడు మాసాల్లోగా సమావేశం కావాలి.

రెండు సమావేశాలమధ్య ఆరునెలలకన్నా వ్యవధి వుండకూడదు.

87. రాష్ట్రీయ ప్రజాకౌన్సిళ్ళు అన్నివిషయాలమీద శాసనాలు చెయ్యొచ్చు. కాని, ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రాలు, ఫెడరల్ అసెంబ్లీ ప్రత్యేకపరచిన విషయాల్ని గురించి తప్ప, తతిమ్మావాటిమీద చెయ్యొచ్చు.

88. రాష్ట్ర శాసనాలన్నీ ఈరాజ్యాంగంయొక్క భావానుగుణ్యంగా వుండితీరాలి.

89. శాసనాల్ని ప్రతిపాదించే అధికారంవున్నవారు:

(ఏ) గవర్నర్,

(బి) రాష్ట్రమంత్రివర్గం,

(సి) రాష్ట్రప్రజాకౌన్సిలు.

పన్నులు విధించేవి, ప్రభుత్వం రెవిన్యూను ఖర్చుపరిచేవి అయిన శాసనాల్ని రాష్ట్రమంత్రివర్గం మాత్రమే చేయగలుగుతుంది.

90. రాష్ట్రంలోవున్న వోటర్లలో మూడోవంతుకు సంబంధించిన స్థానిక ప్రజాసంఘాలకు, రాష్ట్రంలో చేయబడ్డ చట్టాన్ని ప్రజామోదంకోసం తిప్పివంపాలని కోరే అధికారంవుంది.

అటువంటప్పుడు గవర్నర్ సదరు చట్టాన్ని జనామోదంకోసం తిప్పిపంపితీరాలి.

ప్రజలు దానిమీదయిచ్చిన తీర్పు అనివార్యం.

ప్రజాభిప్రాయాన్ని పొందేలోపల ఆ చట్టాన్ని అమలుపరచ గూడదు.

91. రాష్ట్రీయ ప్రజాకౌన్సిలుచేసిన చట్టాలన్నింటిని గవర్నర్ సంతకంచేసి, ఆచరణపరుస్తాడు.
92. గవర్నర్ చేత ఆదేశింపబడ్డ రాష్ట్రీయప్రజాకౌన్సిలు సభ్యుడొకడు, రాష్ట్రీయ మంత్రివర్గాన్ని యేర్పాటు చేస్తాడు.
93. మంత్రివర్గంలోని సభ్యులందరూ రాష్ట్రీయ ప్రజా కౌన్సిలు సభ్యులుగా వుండితీరాలి.
94. మంత్రివర్గం రాష్ట్రీయ ప్రజాకౌన్సిలుకు బాధ్యులు. మంత్రివర్గానిది సమిష్టిబాధ్యత.
95. రాష్ట్రీయప్రజాకౌన్సిలు నూటికి డెబ్భైమంది మెజారిటితో మంత్రివర్గంమీద విశ్వాసరాహిత్య తీర్మానంనెగ్గితే, మంత్రివర్గం రాజీనామానివ్వాలి.
96. కాక, అంతకన్నా తక్కువ మెజారిటీతోగనక మంత్రివర్గంమీద విశ్వాసరాహిత్య తీర్మానం నెగ్గితే, మంత్రివర్గరాజీనామాని గవర్నర్ వొప్పు కోవచ్చు, వొప్పుకోకపోవచ్చు.
97. రాష్ట్రీయప్రజాకౌన్సిలును, గవర్నర్ దాని జీవిత పరిమితికాలముందే రద్దుచెయ్యొచ్చు.

(ఏ) మంత్రివర్గానికి మెజారిటీలేకపోయినా,

(బి) మెజారిటీ వోటర్ల అభిప్రాయాన్ని తెలియపరిచే ప్రజా సంఘాల వొత్తిడిమీద గాని.

98. ప్రభుత్వంయొక్క వివిధ శాఖలు, రాష్ట్రీయప్రజా కౌన్సిలుచే నియామకం చేయబడ్డ స్థాయీసంఘాల యజమాయిషీలో వుంటై.

రాష్ట్రీయప్రజాకౌన్సిలు సభ్యుల్లోనుంచి ప్రతిస్థాయీ సంఘానికి 15 మందిని యెన్నుకోవాలి.

ప్రతిస్థాయీసంఘం ఆసభ్యుల్లోనుంచి ఒక అధ్యక్షుణ్ణి యెన్నుకోవాలి.

ఆయాశాఖలకు సంబంధించిన మంత్రులు అవసరమైనప్పుడల్లా యీస్థాయీసంఘ సమావేశాలకి హాజరై కావల్సినసరంజామా యివ్వాలి.

99. మంత్రివర్గం తాము చేయబోయే ప్రతిశాసనాన్ని, ముందుగా యీ స్థాయీసంఘాల్లో చర్చించి, వారి సిఫార్సునుపొందాలి.

100. రాష్ట్రీయ ప్రజాకౌన్సిలు ప్రతినిధిని ఆయా నియోజకవర్గాల్లోవున్న నాలుగోవంతు వోటర్ల ప్రజాసంఘాలద్వారా తిరిగిరమ్మని ఫర్మానాలివ్వొచ్చు.

ఆనియోజకవర్గంలోవున్న వోటర్లందరికీ యీ విషయాన్ని గవర్నర్ తెలియపరిచి అభిప్రాయాన్ని తీసుకుంటాడు.

యేమాత్రం మెజారిటీతోనైన యీ తిరిగిరమ్మనేవాదం నెగ్గితే, ఆసభ్యుడు రాజీనామా నివ్వితీరాలి.

60 రోజులలోగా యీ కాళీయైన స్థానానికు యెన్నిక జరపాలి.

ఒకవేళ ఆసభ్యుణ్ణి తిరిగి రమ్మనాలి. ఆ నేవాదంగనక వీగిపోతే, తిరిగి 12 మాసాల్లోగా ఆసభ్యుణ్ణి తిరిగిరమ్మని అడగటానికి వీల్లేదు.

**101.** రాష్ట్రీయప్రజాకౌన్సిలు సభ్యులు నూటికి నలభై మందికలిస్తే, గవర్నర్ని తిరిగిరమ్మని ఫర్మానా యిచ్చే అధికారంవుంది.

గవర్నర్ యీ ఫర్మానాను ప్రజాభిప్రాయంకోసం పంపాలి.

యేమాత్రం మెజారిటీతోనైనా యీ విషయం నెగ్గితే, గవర్నర్ రాజీనామా నివ్వాలి.

ఒకవేళ యీ శాసనం వీగిపోతే, మళ్లా యిటువంటి తిరిగిరమ్మనే ఫర్మానా 12 మాసాల్దాకా యివ్వటానికి వల్లేదు.

**102.** అఖిలభారత ఫెడరల్ యూనియన్‌లోవున్న రాష్ట్రాల్లో రాష్ట్రాలకు తగాదావచ్చినా ఫెడరల్ కోర్టు యాజమాన్యంలో లేకపోయినట్లయితే, యీ విషయాన్ని సుప్రీమ్ ప్రజాకౌన్సిలు అభిప్రాయం కోసం పంపుతాడు; ఆ అభిప్రాయానికి వుభయ పార్టీలు బద్ధులుకావాలి.

## XI
## సంఘఆర్థికనిర్మాణం.

**103.** ప్రతి పౌరుడికి సుఖజీవనానికి కావల్సిన వస్తువుల్ని, జీవితాన్ని కళానంతం చేసుకోటానికి తగిన విశ్రాంతిని కలుగజేయటానికని, యీ రాజ్యాంగం, సంఘాన్ని అధికంగా పునన్నిర్మాణం చేయటానికి యేర్పాటుచేయబడింది.

**104.** ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రాలుగాని, చేరనిరాష్ట్రాలుగాని, ఆర్థికంగా ఒక కోఆపరేటివ్ కామన్‌వెల్తు.

105. వస్తువుల వుత్పత్తి ప్రధానంగా ప్రజల అవసరాల్ని తీర్చేందుకే జరుగుతుంది.

106. వ్యవసాయంతాలూకుగాని, పరిశ్రమల తాలూకు వుత్పత్తియావత్తూ ప్రజలఅవసరాల్ని తీర్చేందుకే ప్లాను చేయబడుతుంది.

107. వుత్పత్తి విధానాన్ని ప్లానుచేయటం, పంపిణీసర్దుబాట్లు సజావుగా యేర్పాటుచేయటం, రాజ్యాంగంగనుక - నిపుణులు.

108. ఫెడరల్ యూనియన్‌లోచేరిన రాష్ట్రాల్లోనూ, చేరని రాష్ట్రాల్లోనూ శాసనయుత ప్లానింగ్ సంఘం వుండితీరాలి.

109. ఫెడరల్ యూనియన్‌లో యీప్లానింగ్ సంఘాన్ని సుప్రీమ్ ప్రజాకౌన్సిలు నిర్మాణంచేస్తుంది.

ఫెడరేషన్‌లోలేని రాష్ట్రాల్లో, రాష్ట్రీయ ప్రజాకౌన్సిలు చేత నిర్మాణంచేయబడుతుంది.

యీప్లానింగ్ సంఘంలో, నిపుణులు, రాజ్యాంగంతాలూకు పరిశ్రమలు, వ్యవసాయం, యితర వృత్తుల ప్రతినిధులువుంటారు.

రాజ్యాంగ బ్యాంకుకుగూడా యీప్లానింగు సంఘంలో ప్రాతినిధ్యంవుంటుంది.

వ్యక్తులచేత నడపబడే పరిశ్రమల్లో వుండేవారెవరూ యీ సంఘంలో వుంటానికి వీల్లేదు; కేవలం జీతానికుండేవారు మాత్రం వుండొచ్చు.

110. ఫెడరల్ యూనియన్‌లోని ప్లానింగ్ సంఘం స్టేట్ కౌన్సిలు కిందవుండి, దానిసలహా సంప్రదింపు

లతో నడుస్తుంది.

111. ఫెడరల్, రాష్ట్రప్రభుత్వాలు యీ ఆర్థికాభి వృద్ధికై బాకీలను చెయ్యొచ్చు.

112. ఫెడరల్, రాష్ట్రప్రభుత్వాలు, పరిశ్రమలకు సమిష్టి వ్యవసాయాభివృద్ధికి సహాయార్థం బాకీలిచ్చేందుకు తగిన యేర్పాట్లు తమతమ బడ్జెట్లలో చెయ్యొచ్చు.

113. పరిశ్రమలుగాని, వ్యవసాయంగాని రాజ్యాంగం చేతగనక ధనసహాయాన్ని పొందితే, అవి ప్రజ లందరకు చెందిన సమిష్టఆస్తిగా వుంటై.

వీటిమీదవచ్చే నికరాదాయాన్ని ప్రజలందరికీ చెందిందిగా వుంచి, రెవిన్యూలోకలిపి, బడ్జెట్లలో చేరుస్తారు.

114. రాజ్యాంగంయొక్క బ్యాంకు రాజ్యంలోజరిగే యావత్తు పెట్టుబళ్ళవిషయాన్ని తన ఆధిపత్యంకింద జరుపుతుంది.

115. భూమి, ఖనిజసంపత్తి, రైలుమార్గాలు యిందు మూలంగా ప్రజలకు కూర్చబడ్డినై.

116. ఫెడరల్ ప్రభుత్వంగాని, రాష్ట్రప్రభుత్వంగాని, పూర్వపు సొంతదార్లకు—వ్యక్తులుగాని, సంస్థలు గాని—ఒక సంవత్సరంలోగానే వారికి యివ్వవలసిన ప్రతిఫలం ముట్టజెప్పి, యావత్తుకాండని పూర్తి చెయ్యాలి.

యివ్వవలసిన ప్రతిఫలం, సాలీనావచ్చే అయివేజుకు 7 రెట్లు వుంటుంది.

యీ ప్రతిఫలాన్ని 40 సంవత్సరాల్లో చెల్లించేటట్లుగా, రాజ్యాంగంయొక్క బ్యాంకు స్వంతపూచీతో నూటికి మూడు రూపాయల వడ్డీతో బాండ్లు యిస్తారు.

ఒకవేళ, యీ ఆస్తియేదైన మత, ధర్మ కర్తృత్వాల తాలూకుదైనట్లయితే, యీప్రతిఫలం శాశ్వతంగా యివ్వబడుతుంది; సాలీనా వచ్చేఆయివేజు కిమ్మతుమాత్రమే యిస్తారు.

యీ ప్రతిఫలంకింద యిచ్చేబాండ్లు మార్చడానికి వీల్లేదు. వీటిని రాజ్యాంగంయొక్క బ్యాంకులో వుంచాలి. యివి బ్యాంకుయొక్క బాకీకింద లెక్కవేయబడతై. బ్యాంకు జారీచేసే కరెన్సీనోట్ల కింద లెక్కతీయబడతై.

117. వుత్పత్తి ప్రధానంగా ప్రజల అవసరాల్ని తీర్చేందుకే అనే సూత్రాన్ని ప్రాతిపదికగా తీసుకుని, దానికి ముప్పు లేకుండా వుంటే, వ్యక్తులకుగాని, సంస్థలకుగాని, స్వేచ్ఛావ్యాపారం గ్యారంటీ చెయ్యబడుతుంది.

118. యిటువంటి మూలసూత్రాల నాధారంచేసుకొని జాతీయ ఆర్థికజీవనాన్ని ప్లానుచేస్తూ, వ్యక్తులనుండిగాని సంస్థలనుండిగాని ప్రయివేటు వ్యాపారాల్ని, పెట్టుబడుల్ని, మారకాల్ని వగైరా లావాదేవీలకు, కనిష్టగరిష్ట ఆదాయాల్ని నిర్ణయించటంలోను, వస్తువులధరలు నిర్ణయించటంలోను, శ్రామికులకు, యితరవుద్యోగులకు జీతాల్ని నిర్ణయించటంలోను, లేక, రాజ్యాంగాధికారంలోని తగిన ప్రతిఫలాన్ని సొంతదార్లకిచ్చి, వీటిని కొనివేయటంలోను — రాజ్యాంగానికి సర్వాధికారంవుంది.

## XII

## న్యాయస్థానాలు

**119.** అఖిలభారత ఫెడరల్ యూనియన్‌లోవున్న న్యాయస్థానాల్లోకల్లా వున్నతాధికారాన్ని సుప్రీమ్ ఫెడరల్ కోర్టు పొందివుంటుంది.

సుప్రీమ్ ఫెడరల్ కోర్టు, ఒక ప్రధానన్యాయమూర్తి యింకా నలుగురుగాని, ఆంతకన్న యెక్కువగాని ఫెడరల్ జడ్జీలతో కూడి వుంటుంది.

**120.** యిండియా ప్రధానన్యాయమూర్తి గవర్నర్ జనరల్ చే నియమింపబడతాడు. తతిమ్మా జడ్జీలను, గవర్నర్ జనరల్ ప్రధానన్యాయమూర్తితో సంప్రతించి నియామకం చేస్తాడు.

**121.** యీలోగా రాజీనామా నివ్వకపోతే, ఫెడరల్ కోర్టు జడ్జీలందరు ౬౫ సంవత్సరాల వయస్సువచ్చిందాకా అధికారంలో వుండొచ్చు.

సుప్రీమ్ ప్రజాకౌన్సిల్ యొక్క వుత్తర్వులేనిదే, యీ జడ్జీలను పదచ్యుతుల్ని చెయ్యటానికి వీల్లేదు.

**122.** సుప్రీమ్ ఫెడరల్ కోర్టుయొక్క మూల అధికారం యీదిగువ విధంగా వుంటుంది :—

(ఎ) ఫెడరల్ ప్రభుత్వానికి, ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్ర ప్రభుత్వాలకువున్న తగాదాలనూ, లేక, ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రాలకు వాటివాటి శాసనాధికారాల్ని, యితర హక్కుల్ని గురించి వచ్చిన తగాదాలను తీర్చటం.

(బి) రాజ్యాంగాన్ని సమన్వయపరచటంలో వొచ్చిన యిబ్బందులను గురించి, ఫెడరల్ ప్రభుత్వంగాని, లేక, ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రప్రభుత్వాలుగాని పంపిన సందేహాలను తీర్చటం.

**123.** ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రీయ హైకోర్టులనుండి, సివిల్, క్రిమినల్ ఆపీళ్ళను సుప్రీమ్ ఫెడరల్ కోర్టు వారు వింటారు. లాను గురించిగాని, యితరత్రా ఏదైన సాధారణ అభిరుచిగల విషయంమీద మాత్రమే అప్పీళ్లు చేయటానికి వీలుంది.

ఆ అప్పీళ్ళు యేయే పరిస్థితుల్లో చెయ్యొచ్చు అనే విషయాన్ని గురించి, సుప్రీమ్ ఫెడరల్ కోర్టు నిబంధనల్ని తయారుచేస్తుంది.

**124.** అన్నిరాష్ట్రాల్లోనూ రాష్ట్రీయ హైకోర్టులుంటై.

సదరు హైకోర్టులు, ఫెడరేషన్‌లో చేరని రాష్ట్రాల్లోకల్లా వున్న తాధికారాన్ని పొందివుంటై.

**125.** రాష్ట్రీయహైకోర్టులో ఒక ప్రధాన న్యాయమూర్తి, యింకా ఆరుగురుగాని, అంతకన్నా యెక్కువమంది జడ్జీలుగాని వుంటారు.

యీ జడ్జీలందరూ రాష్ట్రగవర్నరుచేత నామకరణం చెయ్యబడతారు.

**126.** ఆలోగా రాజీనామా నివ్వకపోతే, రాష్ట్రీయ హైకోర్టు జడ్జీలందరూ 65 సంవత్సరాలవయస్సు వచ్చిందాకా అధికారంలో వుండొచ్చు.

రాష్ట్రీయ ప్రజాకౌన్సిల్ యొక్క వుత్తర్వులేనిదే, యీ జడ్జీలను పదచ్యుతుల్ని చెయ్యటానికి వీల్లేదు.

## VIII
## స్థానిక స్వపరిపాలన

127. యీ రాజ్యాంగంలో పొందుపరచిన హక్కులు, బాధ్యతలు నిర్వర్తించటమేగాక, స్థానిక ప్రజాసంఘాలు వాటివాటి పొలిమేరల్లో స్థానిక స్వపరిపాలనా విధానాన్నికూడా నిర్వహించాలి.

128. స్థానిక స్వపరిపాలనలోని పనులు యీ కింద నుదహరింపబడినై:—

(ఏ) ప్రజారోగ్యం.

(బి) స్కూల్ ఫైనల్ వరకు విద్యావిధానం.

(సి) రహదార్లు, పార్కులు—వాటినిర్మాణం, మరమ్మత్తు.

(డి) వుత్పత్తిదార్ల, వినియోగదార్ల కోఆపరేటివ్ సంఘాల్ని స్థాపించి, భద్రపర్చటం.

(యి) శాంతి భద్రతల్ని కాపాట్టం.

(యఫ్) చిల్లర నేరాల విచారణ.

129. స్థానిక స్వపరిపాలనాసంఘాలు యీ పనులన్నంటినీ రాష్ట్రప్రభుత్వంతరఫున, వాళ్ళ ఆదేశాన్నిబట్టిగాని, తమంతట తామేగాని నిర్వహిస్తై.

130. స్థానిక స్వపరిపాలనన్ని నడుపుతున్న ప్రజాసంఘాలు, పన్నుల్ని వసూలు పరిచే హక్కు కలిగి వున్నై. అయితే, రాష్ట్రప్రభుత్వంయొక్క ఆమోదం పొంది జరపాలి.

131. స్థానిక స్వపరిపాలన నిర్వహించటానికి, డివిజనల్, జిల్లా ప్రజాసంఘాలు వుండాలి.

132. డివిజనల్ ప్రజాసంఘాలు, డివిజన్‌లోవున్న స్థానిక ప్రజాసంఘాలనుండి వచ్చిన ప్రతినిధులచేత యేర్పాటగుతై.

133. డివిజనల్ ప్రజాసంఘానికి, డివిజనల్ వుద్యోగి అధ్యక్షుడుగావుంటాడు; స్థానిక పరిపాలన చూట్టమే గాక, డివిజనల్ ప్రజాసంఘం, యీ ఆఫీసరుకు సలహా సంఘంగాగూడా పనిచేసి, ఆయనచేత పనులన్నీ చేయిస్తుంది.

134. ప్రతిడివిజన్‌లో నుంచి 5 గురు ప్రతినిధులు చొప్పున తేలిన ప్రతినిధులతో జిల్లా ప్రజాసంఘం నిర్మాణమౌతుంది.

135. జిల్లా ప్రజాసంఘానికి, జిల్లావుద్యోగి అధ్యక్షుడుగా వుంటాడు; స్థానికపరిపాలన చూట్టమేగాక, యీ యనకు సలహాసంఘంగావుండి, యీయన బాధ్యతల్ని సరిగా నిర్వర్తిస్తున్నాడో లేదో జిల్లా ప్రజా సంఘం చూస్తుంది.

136. డివిజనల్, జిల్లా ప్రజాసంఘాలు స్థానిక స్వపరి పాలనా సంస్థలు:

కాని, ప్రజాస్వామ్యాధికారానికి మూలకందాలైన స్థానిక ప్రజా సంఘాలకున్న స్వాతంత్ర్య అధికారాన్ని యీపైసంఘాలు తీసివెయ్యలేవు.

137. రాజ్యాంగం యొక్క యావత్తు సరంజామును నడిపి, తమ అదుపు ఆజ్ఞల్లో వుంచుకోగల సర్వ తంత్ర అధికారం సంపూర్ణంగా యీ ప్రజా సంఘాల్దే.

---